



## డా॥ ఎమ్. శ్రీరామకృష్ణగారి సాహిత్యం వివరాలు

| | | |
|---|---|---|
| 1. | సీక్రెట్ డాక్ట్రిన్ ఉపన్యాసాలు | 375.00 |
| 2. | ఐశ్వర్యము యొక్క మానసికస్థితి | 160.00 |
| 3. | వేదమయ జీవనం | 56.00 |
| 4. | భారతీయ జీవితవిధానం | 33.00 |
| 5. | ప్రాక్టికల్ థియాసఫీ | 30.00 |
| 6. | శ్వాస ధ్యానము | 20.00 |
| 7. | నవ్యయుగావతరణకు ఏకాదశ పుష్పాలు | 18.00 |
| 8. | అనుగ్రహ మాలామంత్రము | 35.00 |
| 9. | యూనివర్సల్ మైండ్ | 100.00 |
| 001. | సాయి భక్తుల జీవిత విధానం | 5.00 |
| 002. | సాయి అనుగ్రహానికి ఆచరణ సూత్రాలు | 5.00 |
| 003. | నా లక్ష్యము - నా సందేశము | 5.00 |
| 004. | ప్రకృతి ఎల్లప్పుడూ కరెక్టే | 5.00 |
| 005. | త్రిముఖీ గాయత్రీమాత ధ్యానవిధానము | 5.00 |
| 006. | కాలము - లక్ష్యము | 5.00 |
| 007. | యుగసైనికులుగా మన కర్తవ్యము | 5.00 |
| 008. | భూమిపై సశరీరంగా ఉన్న కల్కి అవతారమూర్తి | 5.00 |
| 009. | శ్రీచక్రము | 5.00 |
| 010. | మహాత్ములు నివసించిన స్థల ప్రభావము | 3.00 |

ప్రతులకు: పి. సీతారాముడు, 7-3-14, నర్సయ్య అగ్రహారం, భీమవరం - 534 203. ఫోన్ నెం. 08816- 231755, 9440753115.

# మహాత్ములు నివసించిన స్థల ప్రభావము



డా॥ ఎమ్. శ్రీరామకృష్ణ M.Sc., Ph.D.





ఎడిటర్: పి. సీతారాముడు

ప్రథమ ముద్రణ : 8.12.03.
ద్వితీయ ముద్రణ : 6.2.04

వెల: రూ. 3.00 (పోస్టేజి అదనం)

ప్రతులకు:
పి. సీతారాముడు, H/o. శ్రీ కె. భాస్కరరావు, 7-3-14,
నర్సయ్య అగ్రహారం, భీమవరం - 534 203.
ఫోన్ నెం. 08816 - 231755, 9440753115.

ఎమ్. విజయా విశ్వనాథ్, ప్లాట్ నెం. 1, ఆంధ్రా బ్యాంక్
కాలనీ, మలక్‌పేట, హైదరాబాద్ - 500 036.
ఫోన్ నెం. 040 - 55821954

పబ్లిషర్స్ :
విశ్వకర్మ పబ్లికేషన్స్, భీమవరం.

ప్రింటర్స్ :
సాయి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, భీమవరం.



# మహాత్ములు నివసించిన స్థల ప్రభావము

13.4.03 న జిల్లెల్లమూడి ఆశ్రమంలో
మాస్టరుగారు ఇచ్చిన ఉపన్యాసము



శ్రీ గుళ్ళపల్లి జయరూప్, Lexington, Kentacky,
U.S.A. వారి సౌజన్యంతో



ఓం ............ ఓం ............ ఓం ............

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః

అఖండమండలాకారం వ్యాప్తంయేన చరాచరమ్
తత్పదం దర్శితంయేన తస్మై శ్రీగురవేనమః

భారతీయ చరిత్రలో రాబోయే ఈ ఐదారు ఏళ్ళు చాలా అద్భుతంగా ఉంటాయి. ప్రపంచంలో అన్ని చోట్ల యుద్ధాలు జరుగుతున్నాయి. ఇప్పుడే కాదు, గత 14 ఏళ్ళబట్టి ఎక్కడో అక్కడ కొట్టుకుంటూనే ఉన్నారు.

ఈ యుద్ధాలను ఒక ఆధ్యాత్మిక దృష్టికోణంతో మనం చూడగలిగితే, ఇప్పుడు జరుగుతోన్న (అమెరికా - ఇరాక్) యుద్ధంలో ఒక విచిత్రమైన కండిషన్ ఉంది. అది ఏమిటంటే, ఎవరి మీదకు నువ్వు యుద్ధానికి వెళుతున్నావో, వాళ్ళకి సదుపాయాలు కూడా నువ్వే చేయాలి. ఆ కండిషన్ ఇది వరకు లేదు ఎప్పుడూ.

- మానవ సమాజంలో వస్తోన్న ఆ తేడాను మనం గమనించుకోవాలి. ఆ తేడా రావటానికి ఆధారభూతమైనటువంటి కేంద్రము, "భారతదేశము".



నేను ఏం చెప్తున్నానో అర్థం చేసుకోండి. ఇవాళ ఇక్కడ మనం మాట్లాడుకుంటోన్న మాటలు రాబోయే 5 సంవత్సరాలు తరవాత యూనివర్సిటీలలో సోషియోలాజికల్‌గా, ఆంత్రపోలాజికల్‌గా, జియోలాజికల్‌గా, బొటానికల్‌గా డిస్కస్ చేసుకోబడతాయి. నేను సైన్స్ లెక్చరర్‌ని కనుక ఈ మాటలు తెలిసి వాడుతున్నాను. ఏదో ఊకదంపుడుగా మీకు చెప్పటంలేదు. మొదట, సోషియోలాజికల్‌గా. తరవాత ఆంత్రపోలాజికల్‌గా. అంటే, మానవపరిణామక్రమ విజ్ఞానాన్ని ఆంత్రపాలజీ అంటాం. తరవాత జియోలజీ, బోటనీ.

ఇంత పెద్ద పెద్ద ఈ 4 మాటల్ని అమ్మ నాలుగు తేలికైన మాటల్లో చెప్పింది. "చీపురు, రోకలి, తిరగలి, చేట", ఇవే నాలుగు వేదాలు అన్నది అమ్మ.

అంచేత ఆ నాలుగింటిని చేటగా కాకుండా సోషియోలాజికల్‌గా ఎలా ఉపయోగించుకుంటాం అనే విజ్ఞానాన్ని మనం తరవాత డిస్కస్ చేసుకుందాం. అంచేత అమ్మ మాటలలో ఉన్నటువంటి వైజ్ఞానికతను అర్థం చేసుకోండి. దానికి కావలసినటువంటి బీజాలు వేసుకుంటూ, ఈ యాంగిల్‌ని మనం చాలా జాగ్రత్తగా గమనించుకోవాలి. ఏమని గమనించుకోవాలి?

శివశ్శక్త్యా యుక్తో-యది భవతి శక్తః ప్రభవితుం
న చేదేవం దేవో-న ఖలు కుశలః స్పందితుమపి।
అత స్త్వామారాధ్యాం-హరిహరవిరించాదిభిరపి
ప్రణంతుం స్తోతుం వా-కథ మకృతపుణ్యః ప్రభవతి॥

ఇది సౌందర్యలహరిలోని మొదటి శ్లోకం. మొత్తము అమ్మ రహస్యం మనం అర్థం చేసుకోవాలనుకుంటే ఈ శ్లోకం మనకి గుర్తుండాలి. గురువులకి గురువు అమ్మ, ఎంచేతంటే, గురువులకి కూడా ముందు ఎవరో అమ్మ ఉండాలికదా! కానీ దీనిని మీరు మామూలు లాజికల్‌గా ఆలోచించకండి. చాలా డీప్‌గా వెళ్ళాలి మనం. ఏంటక్కడ మనం చూసేది?

భారత దేశపు స్వాతంత్ర్యానికి పునాది వేసిన వ్యక్తి రామకృష్ణ పరమహంస. ఆయన అమ్మని ఉపాసన చేశాడు. ఎంత పెద్ద గురువులు అయినా వాళ్ళ స్థాయిలో వాళ్ళకి బాధలు ఉంటాయి. అంచేత రామకృష్ణ పరమహంస "నేను ఈ బాధలు భరించలేను మొర్రో!" అంటే, అప్పుడు "సరేలే నీ బాధలు నేను పంచుకుంటాను" అని శిరిడీసాయి అన్నాడు.

ఇక్కడ శిరిడీసాయి రామకృష్ణ పరమహంస కంటే గొప్ప అనేం నేను అనటంలేదు. యుద్ధం జరుగుతూవున్నప్పుడు అందులో ఉన్న లీడర్స్ ఒకరికొకరు సహాయం చేసుకుంటారు.



శిరిడీ సాయికి ఉపాసనీ బాబా అని ఒక ప్రధాన శిష్యుడు ఉన్నాడు. ఉపాసనీ బాబా స్త్రీ వేషం వేసుకుని సూర్యుడిని పెళ్ళి చేసుకుంటాడు. ఈ పెళ్ళి చేసుకునే ముందు మహాత్మాగాంధీ ఆయన దగ్గరికి వచ్చాడు.

"స్వాతంత్ర సంగ్రామం కోసం నువ్వు ఎందుకు ఇంత కష్టాలు పడుతున్నావు? అంత కష్టాలు పడక్కర్లేదు నాయనా, ఒక ఆర్నెల్లు నా ఆశ్రమంలో నువ్వు ఉండిపో, స్వాతంత్ర్యం వచ్చేస్తుంది" అన్నాడు. ఉండనన్నాడు.

✧ ఆరు నెలల్లో రావాల్సిన స్వాతంత్ర్యానికి ఏడేళ్ళు పట్టింది.

***నేను ఈ మాట ఎందుకు చెప్తున్నానంటే,***

అక్కడ ఉపాసనీ బాబా కన్యాకుమారి విగ్రహం ప్రతిష్టించాడు. మాతృశక్తి, స్త్రీ శక్తి, కన్యరూపంలో.

రామకృష్ణ పరమహంస? అమ్మ రూపంలో.

ఇదిలా జరుగుతూ ఉంటే, వివేకానంద యొక్క ఆత్మ జైల్లో ఉన్నప్పుడు ఇచ్చిన వాసుదేవ సర్వమితి అనే సూత్రంతో అరవిందో స్వాతంత్ర్య సంగ్రామంలో

మామూలు వ్యక్తిగా పాల్గొనకుండా, ఒక యోగిగా పాల్గొంటాడు. అక్కడ కూడా ఆయన అమ్మని మథర్, సావిత్రి రూపంలో దర్శిస్తాడు.

* ఈ విధంగా అమ్మ యొక్క అనేక రూపాలను అనేకులు రకరకాల కోణాలలో చూశారు.

ఈ కోణాలన్నీ కలిసిపోయినటువంటి రూపము అర్కపురిలో ఉంది. అర్క అంటే సూర్యుడు అని కూడా ఒక అర్థం. బొటానికల్ అని చెప్పానుకదా! జిల్లెల్లమూడి ఎందుకు కేంద్రం కాబోతుంది అన్నది రాబోయేటటు వంటి తరాలలో అర్థం చేసుకొంటారు.

* మొత్తము ప్రపంచానికి ఆంధ్రప్రదేశ్ జగద్గురు పీఠం వహిస్తే, జిల్లెల్లమూడి న్యూక్లియస్, కేంద్రం అవుతుంది. అంటే, కేంద్రం మహావృక్షంగా ఉండదు. కానీ, కేంద్రం నుంచి శక్తిధారలు అన్ని చోట్లకి వెలువడుతూ వుంటాయి.

ఎందుకంటే, అమ్మ గురువులకే గురువు. అమ్మ యొక్క జీవిత చరిత్ర చూస్తే, అమ్మకి గురువు అవ దల్చుకున్న వాళ్ళందరికీ అమ్మే గురువు అయిపోయింది. మీరు ఇంకాస్త జాగ్రత్తగా అబ్జర్వ్ చేస్తే, రమణమహర్షికి,


అరవిందోకి అమ్మ యొక్క గైడెన్స్ ఎలా లభించాయి అన్నది వాళ్ళ జీవిత చరిత్రలలోనే మీకు కనిపిస్తుంది.

* అంచేత నెలకి మూడు రోజుల పాటు ఈ వాతా వరణంలో ఉంటే చాలు మనం. అంతకంటే ఇంక మనమేం చేయక్కర్లేదు.

సూర్యుడి యొక్క పోషణ కావాలి చెట్టుకి అంటే ఏం చెయ్యాలి? ఏమీ చేయక్కర్లేదు. సూర్యుడికి తనకి మధ్య ఉన్నటువంటి అడ్డు తొలగించుకుంటే చాలు. చెట్టు నీడలో ఉంటే సూర్యుడు యొక్క ఎఫెక్ట్ రాదు.

* అంచేత అమ్మ ప్రభావం ఇక్కడ ఉంది. మన అహంకారాలు, మన ఆలోచనలు అనేటటువంటి ముసుగులు తీసేస్తే అమ్మే నిన్ను ప్రోదిచేస్తుంది.

మనం చేసే తప్పు ఎక్కడొస్తోంది అంటే, ఎంత అన్నా కూడా మన దృష్టికోణం పెడతాం.

"మరి మన దృష్టికోణం పెట్టకుండా ఎలా ఉండగలం?" అది కూడా అమ్మనే ప్రార్థన చేయండి. మనమే మార్చేసుకోగలిగితే ఇంక అమ్మ అక్కర్లేదు మనకి, గురువులు అక్కర్లేదు. అంచేత మనం చేయ గలం, మార్చుకోగలమనే అహంకారాలు వద్దు.

అన్నిటికంటే గొప్పగా అమ్మ యొక్క ఇంకొక ఉదాహరణ ఏం చెప్తానంటే, గురువులు అందరూ వాళ్ళ సమాధి నుంచి పలుకుతారు. అంతేకదా, రాఘవేంద్ర స్వామి కావచ్చు, శిరిడీ సాయి కావచ్చు, వెంకటేశ్వర స్వామిది కూడా సమాధే. అయన కూడా భూలోకంలో మనిషిలాగే తిరిగి శిల అయిపోయాడు. శిరిడీ సాయి యొక్క మానవీయ స్వరూపాన్ని కూడా ఇంకో 5000 సంవత్సరాలు పోతే మర్చిపోతాం.

కాని అమ్మ గొప్పతనం ఏమిటి? ఒక శరీరానికి సహస్రార జాగరణ చేసి, మీరు ఆ కథ చదివితే తెలుస్తుంది. అప్పుడు చాలామందికి హైమ యొక్క శరీరంలో లైట్ ఫ్లో అవటం చూశారు. అంచేత అమ్మ యొక్క గొప్పతనం ఏమిటంటే, ఒక మానవ శరీరానికి సమాధి స్థితి కల్పించి, ఆ సమాధి ద్వారా మీ కోరికలు తీరుస్తుంది.

ఒక శరీరానికి అమ్మ ఆ స్థితిని ఇవ్వగలిగితే, ఎవరికైనా ఆ స్థితిని ఇవ్వగలదుకదా! మరి మనం అమ్మ యొక్క ఆ గొప్పతనాన్ని ఎప్పుడు అర్థం చేసుకుంటాం?

***ఎప్పుడు అర్థం చేసుకుంటాం అంటే,***

అమ్మ సేవలో ఉంటే. అమ్మ ఏ స్థాయిలో



అయితే ప్రణాళికలు ఊహించుకుందో ఆ స్థాయిలో మనం పనిచేయటమే.

- ప్రణాళికలు వేసిన గవర్నమెంటే దానికి కావలసిన వనరులు ఇస్తుంది. కానీ, వర్కర్స్ కావాలి.

***మనం ఏం కన్ఫ్యూజ్ అవుతాం?***

మనం వనరులు సమకూర్చుకోవాలేమో, ఎలా సమకూర్చుకుంటాం అనే బెంగలో ఉంటాం.

మీరేం సమకూర్చుకోలేరు. సమకూర్చుకోగలమా?
అంచేత చేసేదేదో పెద్దదే చేద్దాం.

వివేకానందని ఇంకా వివేకానంద స్థాయికి ప్రపంచం గుర్తించనప్పుడు,

*వివేకానంద ఎప్పుడూ వివేకానందే.*
*కానీ, అప్పటికి ఇంకా ప్రపంచం గుర్తించలేదు.*

భారతదేశం అంతా తిరుగుతూ రాజస్థాన్‌లో ఉండగా దాహం వేస్తే ఒక బావి దగ్గరకి వెళ్ళాడు. రాజస్థాన్‌లో బావి అంటే మీకు ఎంత అపురూపమో అర్థమవుతోంది కదా! అక్కడ ఒక కూలివాడు రొట్టి చేతిలో పెట్టుకుని గాలిలో ఊపుతూ తింటున్నాడు. "ఏం చేస్తున్నావ్?" అన్నాడు. ఏమీ లేదు, ఉప్పు ఉంది

అనుకుని తింటున్నాను అన్నాడు.

☆ "పిచ్చివాడా! అనుకోవటానికి ఉప్పు ఉందని అనుకోవటం ఎందుకు? పంచ భక్ష్య పరమాన్నాలు ఉన్నాయని తినొచ్చుకదా!"

ఉదాహరణని అర్థం చేసుకోండి. మనం చేసే తప్పు అది. ప్రణాళికలు వేసేటప్పుడు మన స్థాయిలో ఆలోచించి వేస్తాం. అది తప్పు. అమ్మ యొక్క పిల్లలుగా అమ్మ స్థాయిలో ఆలోచిద్దాం.

మనం ఆవిడ పిల్లలమని అమ్మ స్పష్టంగా చెప్పింది. అది మన అదృష్టం. పిల్లవాడు ఎలా చేసినా అమ్మ దృష్టిలో ఆనందదాయకమే.

అమ్మకి విషం ఇచ్చారు. విషం ఇస్తే చాలా బాధపడిపోయింది ఆవిడ. ఒళ్ళంతా మంటెత్తి పోతుంటే, "అమ్మా! ఎలా భరిస్తున్నావు?" అన్నారు. "నాయనా! వాడిలో నాకు విషం ఇవ్వాలన్న సంకల్పం వచ్చిన దగ్గర నుంచి నాకు ఈ మంట ఉంది" అంది.

వాడు ప్రణాళిక ఎప్పుడు వేసుకున్నాడో? వాడి సబ్‌కాన్షస్‌లో ఎప్పుడుందో విషం ఇద్దామని? అప్పటి నుంచి ఉవిడకు తెలుసు ఆ మంట.


☆ మరి మనం మన ఆచరణతో అమ్మను ఎలా మండిస్తున్నామో!

ప్రపంచంలో ఉన్న ప్రతీ జీవి అమ్మ పిల్లలే. మీరు అది అర్థం చేసుకోండి. జిల్లెల్లమూడి అమ్మ శరీరం కాదు మీరు చూడాల్సింది. మాతృసత్తా, మదర్లీనెస్.

అంచేత మన ద్వారా అమ్మ మండకుండా, అమ్మని, అమ్మ స్థాయిలో ఆలోచించగలగేటటువంటి పుత్రులుగా మనం మారాలి.

ప్రపంచంలో ఉన్న ప్రతీ వ్యక్తి అలా మారతాడు. ఇవాళ కాకపోతే ఐదేళ్ళ తర్వాత, ఐదేళ్ళ తర్వాత కాకపోతే కచ్చితంగా ఇంకో ఇరవై ఏళ్ళల్లో ఈ ఆలోచనా విధానం యూనివర్సిటీస్‌లోకి వచ్చేస్తుంది. ఇప్పటికే స్టార్ట్ అయింది. ఎస్ట్రాలజీ ఇప్పటికే యు.జి.సి. కరిక్యులమ్‌లో బి.ఏ. డిగ్రీలో ఉంది. సబ్జక్ట్ తీసుకుంటున్నారో లేదో అది వేరే విషయం. కానీ కరిక్యులమ్‌లోకి వచ్చేసింది. రేపు మదర్‌హుడ్డే కరిక్యులమ్‌లోకి వస్తుంది.

ఎవరికి? మొత్తం మానవజాతికి.

మరి దానికి తగినట్టుగా మనం ప్రణాళికలు వేసుకోవటానికి నేను మిమ్మల్ని అందర్ని రిక్వెస్ట్ చేసేది

ఏమిటంటే, కనీసం ఆంధ్రాలో ఉన్నవాళ్ళయినా నెలకు మూడు రోజులు ఇక్కడకు రండి. ఈ వాతావరణంలో అహంకారాలు మర్చిపోయి, వీడు రైట్ చేస్తున్నాడా, వాడు తప్పు చేస్తున్నాడా? ఇవేవీ వద్దు మనకి. అమ్మ యొక్క ఆలింగనంలో, పరిష్వంగనంలో ఇక్కడుందాం.

*ఇక్కడికే ఎందుకు రమ్మంటున్నాను?*

జర్మనీలో ఒక వ్యక్తికి దివ్యదృష్టి ఉండేది. అతను ఇంకా మొన్న మొన్నటి వరకు బ్రతికే ఉన్నాడు. పోలీసులు ఏదైనా కేసు సాల్వ్ చేయలేకపోతే అతని దగ్గరకు వెళ్ళేవారు. ఇక్కడికే ఎందుకు రమ్మంటున్నానో అనేదానికి ఉదాహరణ చెప్తున్నాను నేను.

ఒకసారి ఏమైంది? 12 ఏళ్ళు గడిచిపోయినా ఒక మర్డర్ కేసుని సాల్వ్ చేయలేకపోయారు. అప్పుడు ఆయన దగ్గరకు వెళ్ళారు. మర్డర్ జరిగిన సైట్‌లో ఏదైనా ఒక వస్తువు ఉంటే, అది నా చేతికి ఇవ్వండి అంటే, 12 ఏళ్ళ బట్టీ ఎక్కడో మారుమూల వాళ్ళు విట్‌నెస్‌గా పెట్టుకున్న ఒక రుమాలు ఉంటే, అది ఇచ్చారు.

ఆయన ఆ రుమాలుని చేతిలో పట్టుకుని, ఏం జరిగిందో, ఎవడు చేశాడో అంతా చెప్పేశాడు.



✡ హత్య జరిగిన స్థలంలో ఒక హంతకుడు యొక్క వైబ్రేషన్స్ 12 ఏళ్ళ తరవాత కూడా రుమాలులో ఉంటే,

*12 ఏళ్ళ పాటు అమ్మ జీవించినటువంటి ప్లేస్‌లో వైబ్రేషన్స్ ఎంత ఉంటాయి?*

"మరి దాన్ని మేం పట్టుకోలేకపోతున్నాం మాస్టారు!"

మీరు ముసుగు వేసుకున్నారు.

మీలో అహంకారం ఉంది.

మీరు పిల్లల వలె మారాలి. పిల్లల మనస్తత్వం అంటే, పిల్లలు ఇప్పుడు కొట్టుకుని రెండో నిమిషంలో ఆడుకుంటారు. మనం? ఎప్పుడో ఒక మాట ఎవడో అంటే, చచ్చామన్నమాట ఇంక, ఆజన్మాంతం అది గుర్తుంచుకుంటాం. అది వద్దు.

అదొక్కటీ మనం గుర్తుంచుకుని, అమ్మ ఒడిలో పిల్లల్లాగా ఇక్కడ ప్రతి నెలా మూడు రోజులు ఉందాం. ఇంక చేసుకునేదేదో అమ్మే చేస్తుంది.

స్వస్తి.

